
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **గీతా దీక్ష** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **గీతా దీక్ష** వారి వెబ్ సైట్: http://www.geetadeeksha.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

గీతా దీక్ష వారి వెబ్ సైట్:

**http://www.geetadeeksha.com**



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# वासुदेवः सर्वम्
# VASUDEVAH SARVAM
# వాసుదేవః సర్వమ్

పార్ట్ -1 శ్రీమద్భగవద్గీత:

పార్ట్-2 శ్రీమద్భాగవతమ్



ఆంగ్లమున వివరణ - తెలుగు తాత్పర్యము

రచన :

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.



वासुदेवः सर्वम्
VASUDEVAH SARVAM
వాసుదేవః సర్వమ్

మొదటి ప్రచురణ
నవంబర్ 2008

రచన
అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు
M.Tech.

వెల : అమూల్యం

ప్రతులకు :
ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్థ నగర్,
హైదరాబాద్ - 38. ఫోన్ : 040-23814379

డి.టి.పి. & ప్రింటింగ్ :
కె. మురళీ కృష్ణ
9848515109



## ప్రార్థన

కం॥ శ్రీవనిత ప్రాణనాథుడు
ఆవుల గాచే మురారి ఆలమునందున్
కావగ పాండు తనయులను
తావచియించెనట 'గీత' ధర్మము దెలుపన్.

ఆ॥ భాగవతము బూని పఠియించు టొక్కటే
సులభమైన దారి తెలియ హరిని
తపము లేల చేయ తరలి వనాలకున్
చదువుడయ్య! దీని సరళగతిని

ఉ॥
రెప్పవిడంగ కాదుర హరీ యని పిల్చుట చేత కాదురా
చెప్పుట బాధయున్నదని చిత్రముగా అది వీలు కాదురా
గొప్పలు ఏమి చెప్పెదవు కోతి మనస్సును కట్టవైతివే
ఇప్పటికైన బైటపడి ఈశ్వరునమ్ముము ముక్తి నొందుమా.



కం॥ 'సిరి' నైన లెక్కజేయడు
గరుడుని, ఆయుధములైన గైకొనడాయెన్
పరుగిడు వడివడి గావగ
హరిమించే దెవడు? భక్తులార్తిని దీర్పన్

సీ॥ హరిదక్క నొల్లను అన్యుని అనితొల్లి
'బాలప్రహ్లాదుండు' పంతమూనె
హరిప్రేమనే బొంది ఆనాడు తారయ్యె
'ధ్రువుడు' గగనవీధి 'దొర' గ మారె
హరికి దానంబిచ్చి గురుశాపమును బొందె
'బలి' కీర్తికిన్ సాటి గలదె జగతి?
హరికిచ్చి గుప్పెడు అటుకులు తినబెట్టి
అల 'కుచేలుడు' పొందె అమిత సిరులు

తే॥ హరిని శరణొంది 'కరిరాజు' పరమునందె
హరికి 'దాసుడై' విజయుడు అరుల దునిమె
హరిని సేవించ 'మునులకు' దొరికె ముక్తి
హరిని నమ్మితి నా పుణ్య గరిమవలన.

ఉ॥
అన్నిటి మూలకారణము అంత్యము నేనని తెల్పుమర్జునా!
ఎన్ని విధాల గోరినను ఈరణమాగదు చింతవీడుచున్
ఉన్నత క్షాత్రధర్మమును ఒప్పుగ సేయుము కీర్తినందు మా
ఎన్నటికైన తప్పనిది ఈ మరణంబనియంటివో ప్రభూ!

కం॥ హరిమీద మనసు నిలువదు
కరుణన్ తను కనికరించి కాదనకుంటే
పరుగిడక మనసు నిలుచును
హరిపై, అందాక 'బ్రతుకు' అలయున్ సొలయున్

సీ॥ శిలవోలె పడియున్న లలన అహల్యకు
మనుగడనిచ్చిన పాదమెద్ది?
'కాకమ్మ కథజెప్పి' గడుసరి గుహుడెంతొ
ముదమున కడిగిన పాదమెద్ది?



సిరులమ్మ శ్రీదేవి పరమప్రీతిని ఒత్తు
పావనంబైనట్టి పాదమెద్ది?
ఇంద్రాది సురులెల్ల ఎరిగి శ్రేష్ఠంబంచు
పనివడి గొల్చిన పాదమెద్ది?

తే॥ వరుస మునులెల్ల కోరిన పాదమెద్ది?
పావనిని విభీషణు బ్రోచు పాదమెద్ది?
మదిని దనుజులైనను వేడు పాదమెద్ది?
మనకు దిక్కుమ్రొక్కెనట్టి పాదమదియె.

ఉ॥
నేనె సమస్త విశ్వమును నీమముతో నడిపించు వాడనౌ
నేనె సమస్త భూతముల నిల్పెదద్రుంచెద ప్రాణమిచ్చెదన్
నేను తలంపు మాత్రమున నిప్పునముంచెద సృష్టినంతయున్
నేనె సమస్తమంచునల నీవు కిరీటిని బ్రోచితో ప్రభూ!



## ముందుమాట

అంతయు నీవే, హరి! పుండరీకాక్ష! ...... అన్నాడు అన్నమయ్య. 'ఇందుగలడందులేడని సందేహము వలదు'... అన్నాడు బాలప్రహ్లాదుడు. 'అంతా రామమయం జగమంతా రామమయం'.... అన్నాడు రామదాసు.

ఈవిధంగా చెప్పుకుంటూపోతే ఆ సంఖ్యకు అంతు ఉండదు. "యచ్చాపి సర్వభూతానాం బీజం తత్ అహమ్ అర్జునా!" అనే గీతాచార్యుడి వాక్యానికి పరమార్థం, ఎనిమిదేళ్ళక్రితం శ్రీమద్భగవద్గీత తెలుగు పద్యాల్లో భగవత్కృపతో నేను చేసినప్పుడు నాకు నిజంగా తెలియదు. కారణం నాకు తెలియకుండానే ఈ పద్యాలకి 'రచయితను' నేను, అనే అహంభావం నీడలా నన్నంటి ఉండడమే. కాలప్రవాహంలో ఎనిమిదేళ్ళు కొట్టుకు పోయాక మళ్ళీ ఈనాడు ఈ 'వాసుదేవఃసర్వం చేస్తుంటే



కీ॥శే॥ సుందరరామయ్యగారి జ్ఞాపకాలు నన్ను వివశుణ్ణి చేస్తున్నాయి.
నా చిన్నప్పుడు మా పెదనాన్న వాసుదేవ సోమయాజులు గారు లాంటి పెద్దవాళ్ళు 'మడి' కట్టుకున్నాను 'తాక్కురా' నాయనా! అనేవారు. నేను తాకితే మళ్ళీ స్నానం చేసేవారు. ఒక్కోసారి మళ్ళీ స్నానం చేయలేని పరిస్థితి అయితే సర్వం జగన్నాథం అనుకుని పసుపు నీళ్ళు జల్లుకునేవారు. నన్ను కాసేపు తిట్టేవాళ్ళు. ఆ 'సర్వం జగన్నాథం' అర్థం అప్పుడు అసలు తెలీదు. ఇప్పుడు ఆవగింజంత బోధపడుతున్నది. అదే 'వాసుదేవః సర్వమ్' అన్నీ ఆ శ్రీహరే. "అనుకున్నది జరుగదు, జరిగేది తెలియదు, తెలిసేది నిలువదు, నిలిచేది కలియదు''. అలా కలియకపోయినా, కలవాడు కలిమివాడు ఆ వాసుదేవుడు మాత్రమే. మరి ఆయననెందుకు 'తలవరు?' ఆ పరాత్పరుని 'మాయ' వలన. నేను సర్వసమర్థుణ్ణి అనుకునేవాడు చీకటి గదిలో

ఆవగింజను వెతికి పట్టుకోవచ్చు కానీ వాసుదేవుని తెలుసుకోలేదు. నేను, నాది అనే అహంకారం ఉన్నవానికి, ఆ పరమాత్మ శరణు కోరని వానికి, ఆయన ఎదురుగా వున్నా కనిపించదు, పలుకరించినా వినిపించదు. తాకినా తెలియదు. నీవు నావైపు ఒక్క అడుగు వేస్తే నేను నీవైపు పది అడుగులు వేస్తాను అంటారు ఆ స్వామి. కాని మనమే మొదటి అడుగు వేయాలి. ఆయన మాయవల్ల ఆ అడుగు వేయలేదు మనిషి. ఆ మాయ వదలాలంటే భక్తి కావాలి. ఆ మాయలో ఉన్నంత కాలం "అది కావాలి, ఇది కావాలి" అనే ఆరాటం, "అదిలేదు, ఇదిలేదు" అనే ఏడుపు మనిషిని వదలదు. ఆ పరమాత్మ కృప కలిగిన వారికి మాత్రమే ఆ మాయ కొద్ది కొద్దిగా విడిపోతూ ఏదో ఒక జన్మలో పూర్తిగా విడిపోయి ఆ పరమాత్మ కోసం తన సర్వస్వాన్నీ ధారపోసే స్థితికి తీసుకెళుతుంది. అప్పుడు ఆయన స్వయంగా అక్కున జేర్చుకుని మోక్షం ఇస్తాడు. తన భక్తుడు సాలె పురుగు



అయినా, వేశ్య అయినా, రాక్షసుడయినా ఆయనకు భేదం లేదు. ఎందుకంటే వాటన్నిటిలోనూ అంతరాత్ముడై ఉన్నది ఆ స్వామియేకదా! ఈ విషయం మనందరికీ తెలుసు. కానీ మనం మనకి 'నచ్చని' వారిని ద్వేషిస్తూనే ఉంటాం. నిందిస్తూనే ఉంటాం. అలా చేసినంత కాలమూ మనకి ఏ మోక్షమూ రాదు గాక రాదు. ఉత్తమ జన్మరావచ్చు. అందులో సందేహం లేదు. కాని ఆ పరమాత్మ సన్నిధి మాత్రం రాదు.

వాసుదేవుడే సర్వం అని నూటికి తొంభైతొమ్మిది మందికి తెలుసు, కానీ ఈ జ్ఞానము ఆత్మానుభవముగా మారాలి. అలా మారగానే వాసుదేవుడు సర్వదా మనతోటే వుంటాడు.

ఈ "వాసుదేవః సర్వమ్" పుస్తకంలో రెండు భాగములున్నాయి. ఒక దానికి శ్రీమద్‌భాగవతము (సంస్కృతం), రెండవ దానికి శ్రీమద్ భగవద్గీత ఆధారం.



దేవనాగరి లిపి (స్క్రిప్ట్) తెలిసి తెలుగు లిపి చదవడం రానివారి సౌలభ్యం కోసం శ్లోకాలు దేవనాగరిలోనూ భావం ఇంగ్లీషులోను ఇచ్చాను. అదేశ్లోకం తెలుగు లిపిలో తాత్పర్య సహితంగా ఇచ్చాను. చదువు వచ్చిన ప్రతివారికీ ఇది 'ఉపయోగిస్తుందని' నా ఆశ.

డా॥ బి.వి.ఎస్.ఆర్. మూర్తిగారు, వెంకట స్వామిగారు వంటి నా సన్నిహితుల సహకారం వల్ల ఈ ప్రయత్నం సాధించగలిగాను. ఆంగ్ల తర్జుమాలోగాని తెలుగు తాత్పర్యంలోగాని ఏవన్నా పొరబాట్లుంటే పెద్దలు సహృదయంతో మన్నించగలరు.

డా॥బి.వి.ఎస్.ఆర్.మూర్తిగారి "మేధాబాలిక" (Brain Child) ఈ రచన. శ్లోకాల సెలక్షన్ నుంచి Fine details వరకూ ఆయనదే Main Idea. ఇంగ్లీష్ మరియు తెలుగు తర్జుమాలలోను, ఐడియాను కార్యరూపం కల్పించడంలోను ఏదో నా అనుభవం ఉపయోగించాను.



భగవద్గీత శ్లోకము క్రింద (7-18) అను సంఖ్య ఉంటే ఆశ్లోకం శ్రీమద్ భగవద్గీత 7వ అధ్యాయము నందలి 18వ శ్లోకమని తెలియవలెను. భాగవతము శ్లోకము క్రింద (2-9-32) అను సంఖ్య ఉంటే అది శ్రీమద్ భాగవతంలోని 2వ స్కందములోని, 9వ అధ్యాయంలోని 32వ శ్లోకము అని అర్థము.

**www.geetadeeksha.com** అనే నా వెబ్‌సైట్‌లో మీకు నా ఇతర రచనలు లభిస్తాయి. అయ్యప్ప చరిత్రనుంచి జ్ఞానదేవుని అభంగాలు దాకా చదివి ఆనందించండి.

# ఉపోద్ఘాతము

వాసుదేవుడంటే వసుదేవుని కొడుకు అని సామాన్యంగా అర్థం చెపుతారు. కాని వాసుదేవ శబ్దము పరమాత్మ అర్థము కలది.

**శ్లో॥ "వాసనాద్వాసుదేవస్యవాసితం తే జగత్రయమ్।**
**సర్వ భూత నివా వాసుదేవ నమోస్తుతే॥**

మూడు లోకములు (జగత్రయమ్) తన నివాసస్థానము చేసుకొన్న పరమాత్మ వాసుదేవుడు. ఇతడు సర్వభూతములలోను (జీవులలోను) చైతన్య రూపములో నివసించి ఉన్నవాడు. ఆ వాసుదేవునకు (పరమాత్మకు) నమస్కారమని యీ శ్లోకార్థము.

ఇట్టి పరమాత్మను అనుభవ పూర్వకముగా అన్నిటిలోను దర్శించి, పూజించే జ్ఞానులు, భక్తులు, మహాత్ములు లోకములో చాలా అరుదుగా ఉంటారు.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః॥



ఇట్టి మహాత్ములు జీవన్ముక్తులని చెప్పబడతారు. ముముక్షువులు యీ స్థితిని కోరుకుంటారు. శ్రీమద్భగవద్గీతలోను, శ్రీమద్భాగవతములోను – భగవానుడు చైతన్య రూపము అన్నిటిలోను నిండి ఉన్నాడని, – "వాసుదేవః సర్వం" అని ప్రతిపాదించే వాక్యములు ఎన్నోచోట్ల చెప్పబడ్డాయి. శాస్త్రజ్ఞానము కలవారందరికి యీ వాక్యములు అర్థవంతముగా బోధపడతాయి, కాని వారందరికి అనుభవ పూర్వకముగా తెలియబడవు. భగవానుని అన్నిటిలో దర్శించి పూజించుట కష్టతరమని కూడా అభ్యాసకులకు తెలియవచ్చును. ఇట్టి కష్టతరమైన స్థితి చేరినవారు, సుదుర్లభులని భగవానుడే పేర్కొన్నాడు.

"వాసుదేవః సర్వం" అనే జ్ఞానము కలిగే దిశలో సాధన చేయగా ముముక్షువులకు జ్ఞానోదయమై, ఆ తరువాత భగవానుని కృపకలుగగా, వారికి యీ కష్టతరమైన స్థితిని చేరుట సాధ్యమవుతుంది.

ప్రాథమిక స్థితి (శాస్త్రజ్ఞాన సంపాదన) నుండి



చరమ స్థితి (సుదుర్లభులైన మహాత్ముల స్థితి)చేరే వరకు, భక్తులకు "వాసుదేవః సర్వం" అని ప్రతిపాదించిన వాక్యముల జ్ఞానము అత్యవసరము. ఇంత ప్రాముఖ్యత గల శ్లోకములు యీ సంకలనములో కలవు.

బ్రహ్మశ్రీ అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు గారు సరళమైన భాషలో, వచన పద్య రూపములో ఎన్నో సాదనోపయోగమైన రచనలు చేసారు. గీత, భాగవతములలోగల కొన్ని శ్లోకములకు సరళమైన తెలుగు ఇంగ్లీషుభాషలలో భావార్థములు వ్రాసి యీ "వాసుదేవః సర్వం'' అన్న యీ చిన్న సంకలన గ్రంధము ప్రచురిస్తున్నారు. ఈ గ్రంధము సాధకులకు ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను. వారికి ఆయురారోగ్యములతో పాటు, యీ గ్రంధము చివర శ్లోకములలో చెప్పబడిన ఫలముకూడా ప్రసాదించమని భగవానుని ప్రార్థిస్తున్నాను. స్వస్థి.





श्लो ॥
**वसुदेव सुतं देवं कंस चाणूर मर्दनं**
**देवकी परमानंदं कृष्णं वंदे जगद् गुरुं**

**Sloka :**

Vasudeva sutam, devam, kamsa
chanoora mardanam
Devaki paramaanandam, krishnam
vande, jagadgurum.

Oh! Krishna! the son of "Vasudeva", Oh! Lord! who destroyed "Kamsa" and wrestler "Chanoora", Oh! the child who gives immense happiness to "Devaki" Oh! the "Jagadguru" I bow unto thee.



## అంకితము

ఉ॥ పర్వతరాజపుత్రి తను పాయక గొల్చు
పదంబు, నిచ్చలున్
ఉర్విని ప్రీతిచే పనిచిబ్రోచు పదంబది,
భక్తకోటికిన్
'సర్వమువాసుదేవు'డను జ్ఞానము నిచ్చు
పదంబు, బట్టెదన్
సర్వునికాజగత్పతికి సాగిలి, అంకితమిచ్చి
మ్రొక్కెదన్

## DEDICATION

The feet that are worshipped by Goddess Parvati, The feet that come to the rescue of mother earth, The feet that give the divine knowledge that "Vasudeva" is everything, such feet I will hold and dedicate this to that Almighty and Lord of Universe.



## కృతజ్ఞతా సుమాంజలి

తే॥ తొలుత సుందర రామయ్య తెలిపె గీత
పద్యమున జెప్పి పరమాత్మ వరము గంటి
రామచంద్రమూరితి స్నేహధామమందు
భాగవతునిగ మారితి భాగ్యమిదియె.

ఆ॥ ఆంగ్లభాషపటిమ అంతంత మాత్రమే
అయిన నాకు సాయమైన వారు
'మిత్రవర్యు'లైన వేంకట స్వామికి
వేలవందనములు సలుపు చుంటి.



My "English Prodigy" is negligible. Because of his help only I did this Job satisfactorily. For such a good friend Sri Venkata Swamy I am bowing thousand times.

కం॥ బీవీయస్సార్ మూర్తిని
నా వశమా పొగడ, అతడు నాతోడవుటన్
ఈ వాసుదేవు స్తోత్రము
నీవిధినే జెప్పుచుంటినిదె సుకృతమై.

Dr. BVSR Murthy is the inspiration for this work. Is it possible for me to praise him! Because of the fact he worked so hard this "Vaasudevah Sarvam" is completed. It is my great luck.

# VASUDEVAH SARVAM
## PART I
## BHAGAVADGITA

१. श्लो ॥

ब्रह्मार्पणं ब्रह्म हविर्ब्रह्माग्नौ ब्रह्मणा हुतम् ।
ब्रह्मैव तेन गन्तव्यं ब्रह्मकर्मसमाधिना ।

(4 - 24)

Oh! Arjuna! In a sacrifice to seek "Brahma" a great "Agnikarma" is done. The ladle with which "oblation" is poured into the "Fire" as well as "Fire" are Brahma" The oblation is also "Brahma". That "Sacrifice" is also "Brahma". Finally "Brahma" is the "Goal" aimed at, such "Sacrifice".



# వాసుదేవః సర్వమ్
## శ్రీమద్భగవద్గీత:

1. శ్లో॥

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః
బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్॥
బ్రహ్మైవ తేన గన్తవ్యం
బ్రహ్మకర్మ సమాధినా ॥ (4–24)

తా॥ యజ్ఞ కార్యములలో ఉపయోగించబడు స్రువాది సాధనములు బ్రహ్మము అని తెలియవలెను. హోమము జరుపబడిన ద్రవ్యములు కూడ బ్రహ్మమే అగును. అగ్నికూడ బ్రహ్మమే. హవన క్రియ కూడ బ్రహ్మమే. ఈ బ్రహ్మకర్మ యందు స్థితుడైయుండు యోగీశ్వరుని ద్వారా పొందదగిన యజ్ఞఫలము కూడ బ్రహ్మమే.



२. श्लो ॥

यो मां पश्यति सर्वत्र सर्वं च मयि पश्यति ।
तस्याहं न प्रणश्यामि स च मे न प्रणश्यति ।

(6-30)

Arjuna! He who finds "ME" as Universal self in all beings and all beings existing within "Me" is neither lost to "Me" , nor I am lost to him. He belongs to "ME" and I belong to him.



2. శ్లో॥

యో మాం పశ్యతి సర్వత్ర
సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి
స చ మే న ప్రణశ్యతి ॥ (6–30)

తా॥ ఓ అర్జునా! ఎవరైతే నన్ను సర్వమునందును, సర్వమునూ నాయందును దర్శించగలడో అట్టి ధన్యుడైన భక్తునికి నేను ఎన్నటికీ లేకుండా పోను, అతడునూ నాకు లేకుండా పోడు (వాడు నావాడు, నేను వానివాడిని అని భావము).

३. श्लो ॥

मत्तः परतरं नान्यत्किञ्चिदस्ति धनंजय ।
मयि सर्वमिदं प्रोतं सूत्रे मणिगणा इव ।

**(7-7)**

Oh! Arjuna! other than "Me", there is nothing existing in this entire universe. Like a thread passing through Gem-stones in an ornament, every thing in this entire "Universe" is "threaded" on "Me".



3. శ్లో॥

**మత్తః పరతరం నాన్యత్**
**కించిదస్తి ధనంజయ ।**
**మయి సర్వమిదం ప్రోతం**
**సూత్రే మణిగణా ఇవ ॥**

(7-7)

తా॥ ఓ ధనంజయా! నేనుగాక అన్యమైన దేదియునూ ఈ విశ్వమందెచ్చటనూలేదు. మణిహారమునందు మణులను సంధించు దారమువలె ఈ విశ్వమునకు నేను ఆధారమై, కనుపించకనే విశ్వమునంతనూ సంధించి యున్నాడను.



४. श्लो ॥

रसोऽहमप्सु कौन्तेय प्रभास्मि शशिसूर्ययोः ।
प्रणवः सर्ववेदेषु शब्दः खे पौरुषं नृषु ।

**(7-8)**

Oh! Arjuna! In water, I am in the form of"flavour". I am the bright "Radience" of both the "Moon" and the "Sun". "OM", the sacred syllable in all the "Vedas" is also "Myself". The sound in "Akasa" and "Virility" in all the men is nothing but "Me".



**4. శ్లో॥**

**రసో2హమప్సు కౌంతేయ**
**ప్రభా2స్మి శశిసూర్యయోః।**
**ప్రణవస్సర్వవేదేషు**
**శబ్దః ఖే పౌరుషం నృషు ॥**

(7-8)

తా॥ కుంతీసుతుడవైన ఓ అర్జునా! నీటియందలి రసతన్మాత్రను (తృప్తినిచ్చురుచి) నేనే. నింగినున్న సూర్యచంద్రులకాంతిని నేనే. వేదములన్నిటి యందున "ఓంకారము"ను నేనే. ఆకాశము నందున్న శబ్దమును నేనే. పురుషులయందున్న పౌరుషమును (పుంసత్వమును) నేనే.

**५. श्लो॥**

पुण्यो गन्धः पृथिव्यां च तेजश्चास्मि विभावसौ ।
जीवनं सर्वभूतेषु तपश्चास्मि तपस्विषु ।

**(7-9)**

Oh! Arjuna! I am the pure "odour" in "Earth". I am the brightness in "Fire". I am the "Life" of all beings. I am the "Austerity" in all the "Acetics" who are called "Tapaswins".



**5. శ్లో॥**

**పుణ్యో గంధః పృథివ్యాం చ**
**తేజశ్చాస్మి విభావసౌ ।**
**జీవనం సర్వభూతేషు**
**తపశ్చాస్మి తపస్విషు ॥**

(7–9)

తా॥ ఓ అర్జునా! భూమియందున్న పవిత్రమైన వాసన నేనే. అగ్నియందున్న తేజస్సును కూడా నేనే. సర్వప్రాణులలోని చైతన్యమునిచ్చు జీవశక్తిని నేనే. తపోధనుల యొక్క తపశ్శక్తిని నేనే సుమా!



**६. श्लो॥**

बीजं मां सर्वभूतानां विद्धि पार्थ सनातनम् ।
बुद्धिर्बुद्धिमतामस्मि तेजस्तेजस्विनामहम् ।

**(7-10)**

Oh! Arjuna! know ME as the eternal "seed" of all beings existing in the Universe. I am "Intelligence" of the Intelligent. I am the "Glory" of glorious people.



**6. శ్లో॥**

**బీజం మాం సర్వభూతానాం**
**విద్ధి పార్థ సనాతనమ్।**
**బుద్ధి ర్బుద్ధిమతా మస్మి**
**తేజస్తేజస్వినామహమ్ ॥**

(7–10)

తా॥ ఓ పార్థా! నన్ను సమస్త భూతములకు సనాతనమూ శాశ్వతమూ అయిన బీజముగా నెరుంగుము. ప్రజ్ఞావంతులలోని ప్రజ్ఞను నేనే సుమా! అదే విధముగా తేజోవంతులయందున్న తేజస్సును నేనే.

७. श्लो ॥

बलं बलवतां चाहं कामरागविवर्जितम् ।
धर्माविरुद्धो भूतेषु कामोऽस्मि भरतर्षभ ॥

**(7-11)**

Oh! The best of Bharata race! I am "passion free might" of the mighty; and in all living beings I am in the form of sexual desire that does not conflict with "virtue" or "vedic scriptures".



**7. శ్లో॥**

**బలం బలవతాం చాహం**
**కామరాగవివర్జితమ్ ।**
**ధర్మావిరుద్ధో భూతేషు**
**కామో2స్మి భరతర్షభ ॥**

(7-11)

తా॥ ఓ భరతశ్రేష్ఠా, అర్జునా! బలవంతులందరి యందున్న రాగ, కామ భావనలేని బలమును నేనే. సర్వప్రాణులయందు గల ధర్మ బద్ధమైన కామము కూడా నేనే అయి ఉన్నాను.



८. श्लो ॥

ये चैव सात्त्विका भावा राजसास्तामसाश्च ये ।
मत्त एवेति तान्विद्धि न त्वहं तेषु ते मयि ।

**(7-12)**

There are three qualities common to all people. They are "sattvika" the quality of "Goodness", "Rajas" the quality of "Action" and finally "Tamas" the quality of "sleepy" which is "Inaction".Arjuna! know that all those qualities evolve from ME. But actually neither I exist in them nor do they exist in 'ME'.



**8. శ్లో॥**

**యే చైవ సాత్త్వికా భావా**
**రాజసాస్తామసాశ్చ యే ।**
**మత్త ఏవేతి తాన్ విద్ధి**
**న త్వహం తేషు తే మయి ॥**

(7-12)

తా॥ ఓ అర్జునా త్రిగుణాత్మకమైన సాత్త్విక,రాజస మరియు తామస భావములన్నియు నావల్లనే జీవులకు కలుగుచున్నవని గ్రహించుము. కాని, యదార్ధముగా ఆ భావనలు నాయందు మాత్రము లేవు. నేనునూ వాటియందు లేను. నేను త్రిగుణాతీతుడనని తెలుసుకొనుము.

९. श्लो ॥

मया ततमिदं सर्वं जगदव्यक्तमूर्तिना ।
मत्स्थानि सर्वभूतानि न चाहं तेष्ववस्थितः । ४ ।

**(9-4)**

Oh! Arjuna! whole of this universe is permeated by My divinity without any manifistation. All beings dwelve in Me on My design but in reality I am not present in them.



**9. శ్లో॥**

**మయా తతమిదం సర్వం**
**జగదవ్యక్తమూర్తినా ।**
**మత్‌స్థాని సర్వభూతాని**
**న చాహం తేష్వవస్థితః ॥**

(9–4)

తా॥ ఓ అర్జునా! నిరాకార పరబ్రహ్మనైన నాచేతనే ఈ జగత్తంతయునూ పరిపూర్ణమై నిండి యున్నది. అందు ప్రాణులన్నియునూ నా సంకల్పముచేత అదే ఆధారముగా నాయందే అంతర్గతమై యున్నవి. కాని వాస్తవముగా నేను వాటియందు మాత్రము ఇమిడిలేను.



१०. श्लो ॥

अहं क्रतुरहं यज्ञः स्वधाहमहमौषधम् ।
मन्त्रोऽहमहमेवाज्यमहमग्निरहं हुतम् ।१६।

**(9-16)**

Oh! Arjuna! I am "Vedic Ritual"(Kratu). I am the sacrifice (Yajna) also. I am the offering made to the departed souls. I am the food grains and Herbal Medication. I am the "Sacred Mantra". I am the Ghee used for "Agnikarya" and also sacred "Agni" itself. Verily I am the "Act of offering into the Fire as well.



**10. శ్లో॥**

**అహం క్రతురహం యజ్ఞః**
**స్వధాహమహమౌషధమ్।**
**మంత్రో2హమహమేవాజ్యమ్**
**అహమగ్నిరహం హుతమ్॥**

(9–16)

తా॥ ఓ అర్జునా! నేనే క్రతువును, నేనే యజ్ఞమును, ‘స్వధా’ను నేనే. మంత్రమూ, ఘృతమూకూడా నేనే. నేనే అగ్నిని. హోమక్రియకూడా నేనే సుమా.

**११. श्लो ॥**

पिताहमस्य जगतो माता धाता पितामहः ।
वेद्यं पवित्रमोंकार ऋक्साम यजुरेव च ।।

**(9-17)**

Oh! Arjuna! I am the commander and supreme Ruler of this universe. I am the Father, Mother and also the Grand Father of it. I am "Om" the sacred symbol and also the three Vedas namely "Ruk", "Yajus" and "Sama".



**11. శ్లో॥**

**పితాహమస్య జగతో**
**మాతా ధాతా పితామహః ।**
**వేద్యం పవిత్రమోంకార**
**ఋక్సామ యజురేవ చ ॥**

(9–17)

తా॥ ఈ సమస్త జగత్తును ధరించువాడగు ధాతను నేనే. సర్వులకు కర్మఫలమొసంగునదియును నేనే. అట్లే ఈ జగత్పితయునూ, మాతయునూ, పితామహుడను కూడ నేనే. తెలిసి కొనవలసి వాడనూ నేనే. పవిత్రమైన ఓంకారమును కూడ నేనే. ఋక్, సామ, యజుర్వేదములు కూడ నేనే.



**१२. श्लो ॥**

गतिर्भर्ता प्रभुः साक्षी निवासः शरणं सुहृत् ।
प्रभवः प्रलयः स्थानं निधानं बीजमव्ययम् ।

**(9-18)**

Oh! Arjuna! I am the ultimate goal, and Lord of every being. Also I am the "witness", "Abode", "Refuge" and "Well-wisher" of every one, without any selfish motive. I am the origin and end of everything. I am the resting place, store-house of all beings. I am the imperishable -seed to which they return at the time of Universal destruction.



**12. శ్లో॥**

**గతిర్భర్తా ప్రభుస్సాక్షీ**
**నివాసః శరణం సుహృత్**
**ప్రభవః ప్రలయః స్థానం**
**నిధానం బీజమవ్యయమ్ ॥**

(9–18)

తా॥ ఓ అర్జునా! పరమగతియైన పరంధామము నేనే. జగత్తుకు భర్తయునూ, పోషకుడను నేనే. అందరికీ స్వామినీ, శుభాశుభప్రదాతను నేనే. సర్వులకు నివాస స్థానము, శరణము పొందదగినవాడను, సాక్షిని నేనే. ప్రత్యుపకారమాసించని హిత ప్రదాతను నేనే. అందరి వ్యుత్పత్తి. ప్రళయములకు హేతువును నేనే. వారి స్థితికి ఆధారము, నిధానము మరియు శాశ్వత కారణము కూడ నేనే.

१३. श्लो ॥

तपाम्यहमहं वर्षं निगृह्णाम्युत्सृजामि च ।
अमृतं चैव मृत्युश्च सदसच्चाहमर्जुन ।१९।

(9-19)

Oh! Arjuna! Like "Sun" I radiate heat. I hold back water taken from the sea and give it back as rain, whenever I want. I am the "Immortality" as well as "Death". I am "Being" as well as "Non-being" also.



**13. శ్లో॥**

**తపామ్యహమహం వర్షం**
**నిగృహ్ణామ్యుత్సృజామి చ ।**
**అమృతం చైవ మృత్యుశ్చ**
**సదసచ్చాహమర్జున ॥**

తా॥ ఓ అర్జునా! సూర్యుని రూపమున నేనే తపియింప జేయు వాడను. సముద్రమునుండి నీటిని గ్రహించి వర్ష రూపమున మరల భూమిపై వదలుచున్నాను. అమృతమును, మృత్యువును కూడా నేనే. సత్తు (శాశ్వతమైన ఆత్మ) నూ, అసత్తును (నశ్వరమైన వస్తుజాలము) కూడ నేనే.



१४, १५. श्लो ॥

बुद्धिर्ज्ञानमसंमोहः क्षमा सत्यं दमः शमः ।
सुखं दुःखं भवोऽभावो भयं चाभयमेव च ।
अहिंसा समता तुष्टिस्तपो दानं यशोऽयशः ।
भवन्ति भावा भूतानां मत्त एव पृथग्विधाः ।

(10-4+5)

Oh! Arjuna! There are so many divergent qualities in all beings like Reasoning, Correct Knowledge, Doughtless Understanding, Forbearance, Veracity, Control over Mind and Senses, Happiness and Sorrow, Evolution and Dissolution, Fear and Fearlessness, Non-violence, Equanimity, contentment, Austerity, Charity, Fame and Oblosquy. They do evolve from "Me" only.



**14. శ్లో॥ బుద్ధిర్జ్ఞానమసమ్మోహః**
**క్షమా సత్యం దమః శమః ।**
**సుఖం దుఃఖం భవో2భావో**
**భయం చాభయమేవ చ ॥** **(10-4)**

**15. శ్లో॥ అహింసా సమతా తుష్టి**
**స్తపో దానం యశో2యశః।**
**భవంతి భావా భూతానాం**
**మత్త ఏవ పృథగ్విధాః।** **(10-5)**

తా॥ ఓ అర్జునా! నిశ్చయాత్మక శక్తి, యదార్ధ జ్ఞానము, మోహరాహిత్యము, క్షమ, సత్యము, దమము (ఇంద్రియ నిగ్రహము), శమము (మనో నిగ్రహము), సుఖదుఃఖములు, ఉత్పత్తి, ప్రళయము, భయము, అభయము, అహింస, సమత, సంతోషము, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి, అను గుణములన్నియునూ ప్రాణులకు చెందిన వివిధ భావములు. ఇవియన్నియునూ వాటికి నావలన మాత్రమే కలుగుచున్నవి.

**१६. श्लो ॥**

अहमात्मा गुडाकेश सर्वभूताशयस्थितः ।
अहमादिश्च मध्यं च भूतानामन्त एव च ।

**(10-20)**

Arjuna! I am the universal seed (Atma), in the hearts of all beings. Therefore I only am the "Beginning", the "Middle" and also the End of all beings.



**16. శ్లో॥**

**అహమాత్మా గుడాకేశ**
**సర్వభూతాశయస్థితః।**
**అహమాదిశ్చ మధ్యం చ**
**భూతానామన్త ఏవ చ॥**

(10-20)

తా॥ ఓ అర్జునా! సమస్త ప్రాణుల హృదయములలో నున్న ఆత్మ స్వరూపుడను నేనే. సర్వ భూతముల (ప్రాణుల) ఆదియు, మధ్య స్థితియు మరియు అంత్యమును కూడా నేనే. అనగా సర్వజీవుల సృష్టి, స్థితి, లయ కారకుడను నేనే అని గ్రహించుము.



**१७. श्लो ॥**

आदित्यानामहं विष्णुर्ज्योतिषां रविरंशुमान् ।
मरीचिर्मरुतामस्मि नक्षत्राणामहं शशी ।

**(10-21)**

Arjuna! Among the twelve sons of Aditi I am Vishnu; and the brightest sun among all luminaries. Among "Maruths" (Winds numbering forty nine) I am known as "Mareechi". Among the Stars I am Lord of them known as "Moon".



**17. శ్లో॥**

**ఆదిత్యానామహం విష్ణు**
**ర్జ్యోతిషాం రవిరంశుమాన్।**
**మరీచిర్మరుతామస్మి**
**నక్షత్రాణామహం శశీ॥**

(10-21)

తా॥ అర్జునా! అదితి బిడ్డలైన ద్వాదశాదిత్యులలో నేను విష్ణువును. జ్యోతి స్వరూపులలో నేను సూర్యుడను. నలుబది తొమ్మిది పవనములలో నేను మరీచిని. నక్షత్రములయందు నేను వాటి అధిపతియైన చంద్రుడను.

१८. श्लो ॥

वेदानां सामवेदोऽस्मि देवानामस्मि वासवः ।
इन्द्रियाणां मनश्चास्मि भूतानामस्मि चेतना ।

**(10-22)**

Arjuna! Among Vedas, I am "Sama Veda". Among the GODs I am famous as "Indra". Among the organs of perception (sense) I am known as "Mind". I am the "Chetana" (life energy) in all beings.



18. శ్లో॥

వేదానాం సామవేదోऽస్మి
దేవానామస్మి వాసవ ః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి
భూతానామస్మి చేతనా॥

(10-22)

తా॥ ఓ అర్జునా! నేను వేదములలో సామ వేదమును, దేవతలలో వారి అధిపతియైన ఇంద్రుడను. ఇంద్రియములలో నేను మనస్సును. ప్రాణులన్నిటియందునూ చైతన్యమును నేనే.



१९. श्लो ॥

रुद्राणां शंकरश्चास्मि वित्तेशो यक्षरक्षसाम् ।
वसूनां पावकश्चास्मि मेरुः शिखरिणामहम् ।

**(10-23)**

Oh Arjuna! Among the eleven "Rudras" (Gods of Destruction) I am known as "Sankara". Among the "Yakshas" and "Rakshasas" I am Kubera, the Lord of wealth; among the eight Vasus, I am "Agni" the God of fire and the famous "Meru" among mountains.



19. శ్లో॥

రుద్రాణాం శంకరశ్చాస్మి
విత్తేశో యక్షరక్షసామ్।
వసూనాం పావకశ్చాస్మి
మేరుః శ్శిఖరిణామహమ్॥

(10-23)

తా॥ ఓ అర్జునా! ఏకాదశ రుద్రులలో నేను శంకరుడను. యక్షరాక్షసులలో వారి అధిపతియైన కుబేరుడను నేను అని గ్రహించుము. అష్టవసువులలో నేను అగ్నిని. పర్వతములలో నేను మేరు పర్వతమని పిలువబడుచున్నాను.

